అడుసుగుడిసెలోన క్రొత్త
యెడదను నిర్మించుకొందు.
పసిడిమేడలో జీవిత
పాఠమ్ములు దిద్దుకొందు.

కుత్తుకలో విషము దించి
మెత్తని నవ్వులను పంచి
శివముద్రను దాల్చిన మని
షిని కన్నుల కద్దుకొందు.

సురలకన్న కరుణాత్ముడు
నరుడు గాక యింకెవ్వడు ?
మందిర మెరుగని దేవుడు
మనిషిగాక యింకెవ్వడు ?

అణువులు పగిలించువాడు
ఆత్మలు రగిలించువాడు
మానవుడా, కాడు; రంగు
మార్చుకొన్న దానవుండు.

అక్షరాల గవాక్షాలు



3387/84

# మానవగీతం

నిన్నుగూర్చి పాడుకొందాం.
నన్ను గూర్చి పాడుకొందాం.
నిన్ను, నన్ను గన్న తల్లి
నేల గూర్చి పాడుకొందాం.

నేలపైన మెరిసిన క
న్నీటిచుక్క లేరుకొందాం.
ధూళిలోన విరిసిన హృద
యాల గాథ లేరుకొందాం.

...యుని
...రముగా స్మరింతు. ౨

అడుసుగుడిసెలోన క్రొత్త
యెదదను నిర్మించుకొందు.
పసిడిమేడలో జీవిత
పాఠమ్ములు దిద్దుకొందు.

కుత్తుకలో విషము దించి
మెత్తని నవ్వులను పంచి
శివముద్రను దాల్చిన మని
షిని కన్నుల కద్దుకొందు.

సురలకన్న కరుణాత్ముడు
నరుడు గాక యింకెవ్వడు ?
మందిర మెరుగని దేవుడు
మనిషిగాక యింకెవ్వడు ?

అణువులు పగిలించువాడు
ఆత్మలు రగిలించువాడు
మానవుడా, కాడు; రంగు
మార్చుకొన్న దానవుండు.



3387/84

# మానవగీతం

నిన్నుగూర్చి పాడుకొందు.
నన్ను గూర్చి పాడుకొందు.
నిన్ను, నన్ను గన్న తల్లి
నేల గూర్చి పాడుకొందు.

నేలపైన మెరిసిన క
న్నీటిచుక్క ఏరుకొందు.
ధూళిలోన విరిసిన హృద
యాల గాథ ఏరుకొందు.

శతపత్రమువలె విచ్చిన
జగతి నొక్క చిటికలోన
మసిచేయగ నెంచెడు రా
క్షసవృత్తిని ప్రతిఘటింతు.

మంచి మనసు కెదురొడ్డిన
వంచన తల వంచును లే.
శిశువుల చిరునవ్వుముందు
పశువు కొమ్ము వంచును లే.

త్రుప్పుపట్టలేదా క
త్తులు ఒరలో దాగిదాగి?
బూజుపట్టిపోవా బాం
బులు అరలో మాగిమాగి?

చేయిచేయి కలిపిన వికి
సించును వెచ్చని స్నేహము.
ముడుచుకున్న గుండెలో గు
బుల్కొను నెత్తుటి దాహము.

పరిమళాల నెవ డాపును ?
పైరగాలి నెవ డాపును ?
ఎవ డాపును మానవతా
రవిరుక్కును, కవివాక్కును ?



# అంతర్మథనం

[నా ముప్ఫయ్యో జన్మదినం గుర్తుకు రాగా గుండెలో జరిగిన మథనం]

కాలవార్ధి తరంగడోలనములోన ఎ
న్నెన్ని వర్షాలు గతియించె తుంపరలట్లు ?
ఈ ముప్పదేండ్లు నే నేమి సాధించితిని ?
నత్తగుల్లల నాణిముత్తెమ్ము లనుకొంటి.

కుండపోతగ వాన కురియ నాచేలు పం
డు నటంచు ఎద పింఛమును విప్పినదిగాని;
కురియుటకు ముందు జలధరమాలికలు పొందు
గర్భవేదన ఇంచుకైన గమనించితిన ?

ఒక నాట్యక త్తెరొమ్ముకుదింపు గని బిగిం
చిన వీణవోలె స్పందించిపోయితిగాని;
ఆమెగు త్తపురవికయందు అణగారిపడు
మాతృభావన లేశమాత్ర మ్మెరుగనైతి.

కొసతీగపైన దరహసితమ్ము లారబో
సెడు పువ్వు గని పరవశించిపోయితిగాని;
ఒక్కొక్క రక్తంపు చుక్కతో పూవుమను
గడ పెంచు తీగసంగతి తలచలేనైతి.

వాయులహరులపైన వన్నెవన్నెల కోరి
కలు కాగితంపు పడవల పోల్కి విడిచితిని.
అవి నడుమ మునిగెనా? అవలిగట్టుల వెలుగు
టంచులను చుంబించెనా? యెరుగలేనైతి.

మెరుపుదారపానిముంగురు లెట్లొ దువ్వి నా
యింటిలోపల ప్రతిష్ఠించనెంచితి; గాని,
మింటిలో తప్ప నడిమింటిలో అది వెల్గ
లేదంచు తెలిసికొనలేక బేల్వడిపోతి.

మబ్బులం దెన్ని సామ్రాజ్యములు నిర్మించు
కొని యేమి? ఇసుకదిబ్బను పూరిగుడిసె యొ
క్కటి కట్టుకోలేక కటకటంబడితి; కా
సింత బ్రతుకుంబరువుకే యీడిగిలబడితి.

అంతో యింతో తెలివి యబ్బి నేటికి దశా
బ్దిమ్మయ్యె; ఇప్పటికి చెమ్మగిల్లిన నేత్ర
పుటలలోపలి అర్థముల గ్రహింపగలేక
వెర్రిగ నిఘంటువుల వెంట పర్వెత్తెదను.

కటికనేలను జీల్చి ఝటితిగా పొడుచుకొని
పైకి సాగెడు మొక్కవలె, బ్రతుకులోనుండి
చిమ్ముకొనిపోయి రోచిర్మండలమ్ములో
అడుగిడిననాడె ఆత్మావిష్కరణ మౌను.

గుండెలోతుల త్రవ్వకొనిపోయినప్పుడే
బొగ్గులో రతనాల నిగ్గులు గుబాళించు.
ఆత్మావబోధమైనప్పుడే కన్నీటి
తెరలందు దాగు వెల్తురుపొరల్ భాసించు.



# నాదపరిమళం

ఇపుడిపుడే యేదో నా
దపరీమళకిశోరమ్ము
నామనస్సు లోలోపలి
నందనమున కాల్మోపెను.

పలుమారులు రమణుల చె
క్కిళులపైన జారిపడ్డ
నా చూపులు నేటికి అం
తరకాంతివ్రతములయ్యె.

ఇంకా శమియింపవేమి
ఈ పంచేంద్రియబంభర
ముహుర్ముఖరఝుంకార
మ్ములు, విషయవికారమ్ములు!

క్రొత్త క్రొత్త విరుల పెదవి
కొసల రుచుల మరగినట్టి
మత్తమధులిహము లపుడే
మౌనస్థగితము లగునా?

మల్లడిగోను ఈ బాహిర
కల్లోల మ్మణగినపుడె
అనుభావ్యమ్మగును నిర్గు
ణాంతర్నాదరసాకృతి.

కన్నులెదుట కిర్మీరిత
కాంక్షాకింజల్కమ్ములు
చెర్లాడగ మనసులోని
చిరవాసన లారుబెట్లు?

క్షణకాలావధికమన
స్తర్పణనిఘ్నమ్ములైన
ఈ వాసన లెచట? శశ్వ
దీశ్వరపరిమళ మ్మెచట?

ప్రణవాక్షరపద్మముఖ
ప్రసరన్మృదుపరిమళమ్ము
నా తనువున కమృతచేత
నస్థితి కలిగించుగాక.

బహూస్పృహాసంక్షోభ
స్ఫాటితమౌ అస్మదంత
రాళములో ఆనందమ
రాళము రమియించుగాక.



# జాగృతుడు

క్రాంతకాల మిటులే యేకాంతమ్మున మేలుకొందు.
కనురెప్పల కశ్రువులను కావలిగా నిల్పుకొందు.

కారెక్కిన లోకపు డెక్కల ధూళిపరంపరలను
నిట్టూరుపుతోడ చెదరగొట్టు చేవ పెంచుకొందు.

పొంగులెత్తి వచ్చు ద్వేషమును సలసల కాచివైచి
బొట్లుబొట్లుగా స్నేహమ్మును ఎదలో వడిపికొందు.

ప్రతీకారవాంఛ నాగుపామై బుసగొట్టుచుండ
గుండియ నొక మధురవేణుదండముగా మలచుకొందు.

నాముందర గుడ్లగూబలై మసలెడు చీకట్లను
చుంచుదువ్వి చక్కని పుంస్కోకిలలుగ మార్చుకొందు.



# మనశ్శైశవం

లోకవృత్తమాధ్వీకలోలుపము, తామ
సైకవాసనాదృప్తము, సమ్మదద్వి
రేఫరూపాంతరమ్ము నాహృదయ; మిందు
చిత్రముగ నేడు శిశుత రసీభవించె.

ఇది నాగుండియగూడున
పొదిగికొనిన నూతనానుభూతి; పసరులౌ
తుదరెక్కలపై బడి రా
త్రిదినమ్ములు మంచుబొట్ల తీరుగ జారెన్.

నాలో మయూరపింఛమ్ము చవుకలించె,
గగనాన మబ్బుతున్కయును లేదు;
నేను మిన్నంటు వెన్నెలపుల్గు నై పోతి,
శారదశర్వరీచ్ఛాయ లేదు;
నాలోన పద్మగంధమ్ము వాకలుగట్టె,
పొడుపుగుబ్బలిని కెంబూతలేదు;
నేను కోకిలకుహూస్వానమ్ము నై పోతి,
గున్నమామిడి పూత గొనగలేదు,
సృష్టినియమాతిరిక్తమై ఛిన్నభిన్న
వాసనాప్రగ్రహమ్మయి, భాసమాన
నవ్యలోకావృతమ్మయి, నా యెడంద
శైశవానందపీఠసంస్థాయి యయ్యె.

ఒకకొంతసేపు సద్యోదళన్మందార
ములతోడ దాగుడుమూత లాడి
ఒకకొంతసేపు వాయుగరుత్తు లూది ప
ట్టికొని వ్రేలుచు పల్లటీలు గొట్టి
ఒకకొంతసేపు నింగికి లేచి సురచాప
ఖండమ్ముపై 'జారుబండ' లాడి
ఒకకొంతసేపు చంద్రకరండమందు వె
ల్గెడు వత్తికోసమై కేలుసాచి

ఇష్టఖేలావిలాససంతుష్టభావ
నాతరంగితస్వాంతసుందరుడ నౌచు
జగతి నొక మల్లెపూలచెండుగ మలంచి
కదలితిని శైశవామృతఘటికలోన.

ఎందేగినఁ పూల మందలే కనిపించు,
లేవు మొగమ్ము చిట్లించు మ్రోళ్లు;
ఎటు చూచినఁ పూర్ణిమేందువుల్ రవణించు,
కన్నుబుస్సొడు చీకట్లు లేవు;
ఎటు విన్న మత్తక్రేంకృతులే ప్రతినదించు,
లేవు పుచ్ఛములు వాల్చెడు నెమళ్లు;
ఎటు గన్న చిరునవ్వులే ఇవతాళించు,
మనుజరూపభుజంగములు లేవు;
ఒక శరత్తొక వర్షర్తు వొక వసంత
మను వివేచనీయావస్థ నతిగమించు
శబలితమృదూహసంపుటి శైశవమ్ము
నను రసైకదృశాభిరమ్యునిగ జేసె.

ఏపూర్వజనుఃపుణ్యప
రీపాక మ్మిటుల అంకురించెనొ శిశుతా
రూపకముగ నా యెదలో,
ఆ పుణ్యమె నాదు జీవితాశయ మగుతఁ.



# నా కోర్కి

చీకటులు నా కంటిరెప్పల
సెజ్జలందున మేను వాల్చిన వేళలో,
లోకమంతయు నిదురకౌగిలి
లో నఖంపచమై సుఖించెడి వేళలో,

ఒంటిగా పర్యంకమున ని
ట్టూర్పులకు ఊపిరులు వోయుచునుంటిని;
కాలుజారెడు ఊహలకు రె
క్కలను జేరిచి ఎగురవేయుచునుంటిని.

బయట చీకటి, మనసులో శం
పాలతలు వెరగంది చూచిన వెల్తురు.
తారకల చెక్కిళ్ళు నించుక
తాకు తలపుల నెవ్వరెవ్వరొ పిల్తురు.

ఎవ్వ రెరుగుదు రీ మిణుంగురు
దివ్వియల ఆంతరచిరంతనసారము?
ఎచట నున్నదొ చెప్పగలనా
ఈ తమిస్రమహార్ణవమునకు తీరము?



# విషపానం

[చిరకాలంనుంచి సుఖాలకు మరిగి పరవశుడై ఉన్న ఒక అసామాన్యజీవి ఒక్కమాటు త్రుళ్ళిపడి చేసుకున్న ఆత్మవిమర్శ యిది. దీనిలోని విషం జీవితపథంలో గిరుక్కున తిరిగే మలుపునూ మార్పునూ సూచించే సంకేతం]

నన్ను త్రాగనిండు విషము,
నా కదియే జీవరసము.

కాకోల మ్మనుకొందురా?
కాదు కాదు; గుత్తులుగా
పండిన చీకట్లు పిండి
వడపోసిన రాగరసము.

తుమ్మెదసుల్తానుల పద
ధూళినైన నోచుకోని
పూచిన ఉమ్మెత్తపువ్వు
నా చషకము నా చషకము.

నాటి గరళకంఠునితో
పోటీ చేయుటకు గాదు,
సోక్రటీసు సరిబంతిని
చోటు గడించుటకు గాదు.

వింత మాధురులకు మరగి
వెన్నెలదిండ్లపై ఒరిగి
జడీభవించిన బ్రతుకున
సన్నని మంటలు లేసగ—

నిప్పువోలె గుప్పున మం
డెడు బాధాపరిమళముల
తియతియ్యని చురుకులు గుం
డియలో తీండ్రించిపోవ—

మదిరాక్షుల పెదవుల గల
మధుశాలలలోన దిరిగి
మత్తిల్లిన చూపుల కిసు
మంత చేదు రుచిచూపగ—

నన్ను త్రాగనిండు విషము,
నా కదియే జీవరసము.

ఎల్లరి కీవిషము మృత్యు
హేతు వనుట వెఱ్ఱిమాట.
గుండె గట్టిదైన కాల
కూట మమృత మైపోదా ?

నా కెందుకు ముద్దగట్టి
నట్టి యీ పసిండిబ్రతుకు ?
ప్రతిక్షణము దీపశిఖా
ప్రతినిధిగా జీవింతును.

ఈషణత్రయమ్మున కొ
క్కింత మనసు మొగ్గతిలిన
ఆత్మనుమాత్ర మ్మొక స్నే
హప్రపగా వెలయింతును.

సందెగద్దెపై గొండిలి
సలిపెడు వెల్తురునీడల
భ్రూవల్లీస్పందనముల
లో విశ్వస్థితి గాంతును.



# జీవనకేళి

ఓహో ఈ బ్రతుకేమిటి
ఊహల వైకుంఠపాళి
విద్యుత్కౌముదిలో గో
పికలు లేని రాసకేళి.

పొడివోయిన గొంతుకలో
తడి కూర్చని హిమపానం
చెవుల సందులందే మూ
ర్ఛిల్లిపోవు పికగానం.

పాదరసంగుళికలాగు
పట్టిన నిల్వని కాలం
కంటబడ్డ ప్రతిమనిషీ
కండవున్న కంకాళం.

పెదవులపై జిగురువెట్టి
అదికించిన చిరునవ్వులు
ఎడదలపై ప్రాకి తూట్లు
పొడిచే గొంగళి పుర్వులు.

స్నేహరసము నందించెడు
జీవి నొసట మసిముద్రలు
నిలువెల్ల విషము దాచెడు
ఖలుని కేమొ మణిముద్రలు.

కుందేళ్ళను డీకొని పరు
గులు దీసెడు తాబేళులు
అర్థాలను గదినిడి వా
హ్యాళి కేగు శబ్దాళులు.

గానుగెద్దువలె గమ్య
స్థాన మెరుంగని యాత్రలు
రంగము వీడినను ముఖపు
రంగులు కడుగని పాత్రలు.



# విచిత్రమేళనం

చేదులోన స్వాదుతావిచిత్రరుచిప్రేరణమ్ము
అవ్యక్తములోన వ్యక్తతావృథాప్రతారణమ్ము
అశ్రుసిక్తపక్ష్మమ్ముల అగ్నిశిఖాఖేలనమ్ము
ఏమి టీ అపూర్వానుభవామృతవిషమేళనమ్ము !

నొసట వ్రేలు ముంగురులం దుసికొల్పెడు ఉన్మాదము
నుసిరాల్చెడు దివ్వెలలో మసిలిపోవు ఉన్మాదము
ప్రసవదళమ్ముల కన్నుల పగటికలల కీలనమ్ము
ఏమి టీ అపూర్వానుభవామృతవిషమేళనమ్ము !

మంచుపొగలలో రేగిన మించుకాగడామిన్కులు
మధురయామినుల మూగిన విధురజీవితపు కున్కులు
గాలితరగలందు గడ్డకట్టిన మధుపాలనమ్మ
ఏమి టీ అపూర్వానుభవామృతవిషమేళనమ్మ !

నిట్టూర్పుల తీగల స్పందించెడు మోహనరాగము
నీడల పెదవులపై పారాడెడు కాంతిపరాగము
నీలో నాలోపలి సంధ్యాలయసంచాలనమ్మ
ఏమి టీ అపూర్వానుభవామృతవిషమేళనమ్మ !




కన్నీళ్లతో తడిసియున్న నా బ్రతు కార
వేయుటకు నీ కంటివెలుగే శరణ్యమ్మా.

యాతనల రంపాల కోతవడు నా గుండె
శమియింప నీ చేతిచలువే శరణ్యమ్మా.

నరనరమునందు చిచ్చు రగుల్చు బాధలను
చల్లార్ప నీ నెనరుజల్లే శరణ్యమ్మా.

అడుగడుగునకు తూలిపడు ఆశయమ్ములను
నడుప నీ ఆలంబనమ్మే శరణ్యమ్మా.

పగలె చీకట్లు గ్రమ్మగజేయు సంశయ
మ్ముల మాప నీ దివ్యమూర్తియె శరణ్యమ్మా.




నను మాఘమాససుందరి తేరిచూచినది
బరికత్తులను మొండిపరచు చూపులతోడ.

నాయెదుట శిశిరకాంత నటించిపోయినది
జలతారు మంచుకుచ్చెలలు దుసికిళ్లాడ.

చిటిలినది నా అధరపుట మొక్కటే కాదు
మెయిమడతలఁ దాగిన యెడందసైతమ్ము.

పుండువడినది లేతగుండె యొకటే కాదు
పాలరెక్కల భావనాలలితమూర్తులును.

అసలే వియోగదగ్ధాకృతిని; అందులో
శిశిరన్తకి చేలచెరగుగాడ్పుల దాడి.

ఇక నేమి? మండిపోయెడు గుండెపై క్రొత్త
కుంపటుల్ భుగభుగ రగుల్కొల్పినటులయ్యె.

ఐన ఈ బాధ నా కీనాటిదా, కాదు.
ప్రతిఋతువులో ప్రజ్వలితమైనదే కదా!

ఇదిగో వసంతమని యెదపొంగి లేచితిని,
అది పికీకంఠమం దొదిగి కేరింత లిడె.

గ్రీష్మమని యింటిముంగిట నిల్చి చూచితిని,
కనులు రెండింట దుమ్మును గొట్టి పోయె నది.

జలదఋతు వంచు మిన్నుల క్రేవ కేల్సాచ
గ్రుడ్డెఱ్ఱజేసి పిడుగులు రాల్చి పోయె నది.

ఓహో శరత్తని మధూహలను పెంచుకొన,
అది చకోరికలకే అంకిత మ్మైపోయె.

చివరి కొంక చలికారు చిక్కెనని ఉప్పొంగ,
అది జంటకౌగిళ్లయందే నలిగిపోయె.

మిగిలినది ఈ శిశిరమేకదా మరి! ఇదియు
నను దిగంబరునిగా నొనరించ కెటు లుండు?

ఇంత కొండంత బాధేతిహాసమ్ము నా
మది దాచి, పెదవులఁ మల్లికలు పూయింతు.

కొండకోనల నంటుకొనెడు దావాగ్ని కా;
దిది అంతరాల మండెడు బాడబజ్వాల.

ఓ శిశిరవిషధరశ్రీకుంతలా! చలఁ
మిహికాపటాంచలా! మేను పరచితి, రమ్ము.

నడచిపో నా మొండియొడలిపై; కాదేని
విడిచిపో ఈ పూలపెండ్లిపందిరినుండి.




నా యింటికి, మింటికి సం
ధానసూత్రమై నిల్చెను
ఎదో చైతన్యతరంగము;
ఎదిగిన తేజశ్శృంగము.

కుళ్ళగుంటలన్ని పాల
మళ్ళై, కత్తులను పొదుగు
కొన్న ఇరుల ఒరలు పూల
గూళ్ళై మిరుమిట్లు గొలిపె.

నెలలకొద్ది మంచులోన
నిలబడి కంపించు మొరడు
మొగములపై మ్రోసె లేత
చిగుళ్ళ మంటల పల్లవి.

గడ్డిగరచుకొని పరున్న
గ్రుడ్డిపూలు శ్రీవక్షుని
పారిజాతమాలకు సరి
బంతిలో విరాజిల్లెను.

బురదలోన బ్రతికెడు కు
మ్మరిపురుగులు గూడ నేడు
తుమ్మెదలై, గులాబీల
తో వియ్య మ్మందుకొనెను.

ఈనా డొక బిచ్చకత్తె
యైనా మాన్యశ్రీమతి.
చెమటవడిపి కట్టిన ప్రతి
చీకు గుడిసె అమరావతి.



# కన్నీటి తెరలు

కన్నీటి తెరలు నా
గళము కడ్డమునిల్వ
ఏమి పల్కుదును నే,
నెటుల పల్కుదును ?

కన్నీటి జాలు నా
కలములో చొరబడిన
ఏమి వ్రాయుదును నే,
నెటుల వ్రాయుదును ?

నరము నరమున బాష్ప
ఝరము త్రుళ్లింత లిడ
ఏమి పయనింతు నే,
నెటుల శయనింతు ?

గుండెయే ఒక అశ్రు
భాండమై తొణకగా
ఏమి భావింతు నే,
నెటుల జీవింతు ?



# నాడూ నేడూ

'క్రన్నీరే కావలెనా
పన్నీరే కావలెనా'
కన్నీరే కావలెనని
అన్నా నొకనాడు.

తలపులు పన్నీటిలోన
జలకమాడు తరుణమందు
కొంటెగ కన్నీరు కోరు
కొంటిని ఆనాడు.

ఒక్కొక్క కన్నీటి చుక్క
చెక్కిట చిచ్చయి రాలగ
తరలిన పన్నీటి బ్రతుకు
తలచితి నీనాడు.

'కన్నీరే కావలెనా
పన్నీరే కావలెనా'
బదులు పల్కలేక శిరము
వాల్చెద నీనాడు.



# ఎడారి

ఇది యెడారి; శూన్యానికి
మృదులమైన మారుపేరు.
ఎవరి వేడి నిట్టూర్పులో
ఇచట వీచు వడగాడ్పులు!

కదలని కెరటాలవోలె
కనిపించు ఇసుకదిబ్బలు.
నడువ నడువ ఎడదలోన
పొడమును కానని బొబ్బలు.

ఈ యెడారిలో సాగితి,
ఈ యెడారిలో ఆగితి,
దోసెడంత నీటి చెలమ
ఆశల పందిళ్ళు వేయ.

చెలమలోకి తొంగిచూడ
చిత్రముగా వినిపించెను,
'నీళ్లు కావు పాంథా! క
న్నీళ్లు సుమా' యను గొంతుక.

నా పెదవుల తొణకిన మంద
స్మితమే బదులుపల్క
కన్నీళ్ళే నా పాలిటి
గంగాజల మని త్రాగితి.



# అందం

వెన్నెల లున్నపుడు ఇరుల
నెన్నుకొనుట ఒక అందము.
తీపిగడియలందు చేదు
జ్ఞాపకమ్ము లొక అందము.

సంయోగములో విరహ
చ్ఛాయ లున్న ఒక అందము.
ఆనందములో విషాద
గాన మున్న ఒక అందము.

నిండువసంతమ్ములోన
పండుటాకు లొక అందము.
పున్నమిచంద్రుని చెక్కిట
పుట్టుమచ్చ ఒక అందము.

కాకలీస్వరమున ఇంచు
కంత జీర ఒక అందము.
జలజల పారేటి యేటి
మలుపులోన ఒక అందము.

చావలేక బ్రతుకలేక,
సాగలేక ఆగలేక
అటమటించు జీవితాల
కంద మేది? అర్థ మేది?



# ప్రహ్లాదం

ఇది జీవనసంధ్యలోన
కొదమకోర్కె లల్లుకొన్న కల్హారం;
ఇది ఆశల కుంపటిలో
ఒదిగి ఒదిగి రగులుకొన్న అంగారం.

ఇది హిరణ్యకశిపుని ఉ
న్మదచేష్టల కెదురుదిరుగు ప్రహ్లాదం;
ఇది విశ్వంభరుని పచ్చి
నుదుట ముత్యములు పంచిన ప్రస్వేదం.

నక్షత్రాక్షతల కొరకు
నడినింగికి పడగెత్తిన మస్తమ్మది;
చందురు డను అందుగుచిగు
రందుకొనగ దండడించు హస్తమ్మది.

చినిగిపడిన రేబవళ్ళ
చేర్చికుట్టు ఎఱ్ఱపట్టుదారమ్మది;
కుదురులేని పుడమిని తన
యెదపై నిలిపిన శూన్యాధారమ్మది.



# అమృత లిప్త

వేమన పంచాయతీ గ్రంథాలయం,
తేలప్రోలు :: కృష్ణా జిల్లా.

[విషాదతిమిరంలో తళుక్కుమన్న రసరేఖ]

ఎన్నాళ్లకు నా మనసున
వెన్నెలచిన్కులు కురిసెను!
పలుకలేని కోర్కెలు చెం
గలువదండలై విరిసెను!

సగములోనె ఆగిన పా
ట గభాలున రెక్కలార్చె.
బొత్తిగ బిగిసిన గొంతు స
రిత్తువాలె గతులుదీర్చె.

పిడికిట ఇమిడెడు హృదయం
జడధియంత విస్తరించె.
మంచముపట్టని వాకిలి
మహాకాశమై రహించె.

సుప్తరాగగర్భంలో
సప్తస్వరములు మొరసెను.
వసివాళ్వాడిన ఊహలు
పసరుటాకులై మెరసెను.

తారలు దిగివచ్చి దీప
తోరణాలలో నిల్చెను.
కోటికాంతికళిక లిరుల
కొమ్మలపై విరబూచెను.

దిగంతాలు బారసాచి
దృగంతాల కవుగిలించె.
జగమంతా తొణకని మధు
చషకమ్మై కానుపించె.

గిరులు మెత్తబడసాగెను.
ఝరులు ఒత్తిగిలి సాగెను.
కంకరనేలలు పచ్చని
కలల పాన్పులుగ మారెను.

పడిపోయిన అర్ధాంగం
పల్లవించిన ట్లయ్యేను.
తెగిపోయిన ఆశావళి
తీగసాగిన ట్లయ్యేను.

ఇది ఒక అమృతలిప్తలో
ఎగిసిన మధురానుభూతి
ఎదకన్నులలో మృదువుగ
కదలిన సాకారగీతి.



# శరద్భావన

కుసుమించిన బీరపూల
కోర్కెల నునురేకులపై
విషక్రిముల కోరల ర
క్కసినొక్కులు పడుచుండగ—

పరమసాత్వికుని అంతః
కరణముబోలిన నింగిని
మత్తెక్కిన కారుబోతు
మబ్బులు డీకొనుచుండగ—

పాపలవలె పుడమిఒడిని
పవళించిన పైరులపై
పొంగుపేళ్లు విరుచుకపడి
పొట్టబెట్టుకొనుచుండగ—

అన్నార్తుల నిట్టూర్పుల
ఆవిరితో చందురు డను
మణిముకురము అనుదినమ్ము
మసకమసక యగుచుండగ—

శరదిందిర చిరుఅందెల
స్వర మేదో వినిపించెను.
ఋతుచక్రము తిరిగిన సం
గతి కలగా స్ఫురియించెను.

దూదిపింజలై మొయిళ్లు
తూలిపోవు ననుకొంటిని.
పాలకుండలై చెరువులు
పరిమళించు ననుకొంటిని.

పగలంతా పొగచూరిన
జగతి నేడు కసటులేని
కలికివెన్నెలల జల్లుల
జలకమాడు ననుకొంటిని.

ఋతులక్షణ మీగతి పరి
ణత మౌనని యనుకొంటిని.
కానీ యెప్పటివలె లో
క మ్ముండుట కనుగొంటిని.

పూలకారులో ఆకులు
రాలుట గమనించలేద?
వానకారులో నిప్పులు
వర్షించుట చూడలేద?

మరి నేడో శరచ్చంద్ర
తరళకిరణహాసములను
మబ్బుతెరల కటకటాల
మాటున పరికించలేద?

ఇంత వింతగా కాల
మ్మెదురుదిరుగ హేతువేమొ?
మనిషిమనసువలె ఋతువుల
మర్యాదలు మారెనేమొ?

రసావేశమున గుండెలు
రవళించిన వేళలోన
కమలపత్రముల దాగిన
భ్రమరఝుంకృతులు విందును.

ఎదలో ఆనందరేఖ
మృదువుగ కదలాడినపుడు
సర స్తరంగముల నూగు
మరాళముల కనుగొందును.

తనువే మనసుగా మారి
వినువీధుల కెగిసినపుడు
విరబూచిన శరదిందుని
విశ్వరూపమును చూచెద.

ఋతువు లెన్నిరీతులుగా
గతులు మార్చుకొన్న నేమి
బ్రతుకులో విజయదశమీ
పర్వచంద్రికలు నిల్పెద.

కాలము శనివోలె, అశని
వోలె నెత్తిపై బడినను
ఆశయధ్వజమ్మను శిఖ
రాంచలమున నెలకొల్పెద.




క్రాలం కేలెత్తి పిలుస్తున్నది.
కంకాళం లేచి నడుస్తున్నది.
పొగచూరిన బ్రతుకులతో
పొగిలిన నరజాతిధరా
గగనాలకు వంతెన కడుతున్నది.

సమరాలకు సమాధి అవుతున్నది.
శాంతికి పరిణయం జరుగుతున్నది.
విషదంష్ట్రావిముక్తమై
విశ్వంభర కార్తీకపు
వెన్నెల్లో జలకమాడుతున్నది.

వెనకచూపు ప్రక్కముడుచుకున్నది.
ముందుచూపు రెక్కవిప్పుతున్నది.
చివికిన తాటాకుపుటల
చెరిగివేసి చరిత్ర బం
గరుచిగురాకులను తొడుక్కున్నది.

శ్రమశక్తికి విలువ పెరుగుతున్నది.
జనహృదయం బలం పుంజుకున్నది.
గిరిజనుడే పురజనుడై
ధరాచక్రమును త్రిప్పే
తరుణారుణకాలం వస్తున్నది.

పొలిమేరలు తుడుచుకపోతున్నవి
సరిహద్దులు ముడుచుకపోతున్నవి
గాలివోలె, పరిమళాల
జాలువోలె, భిన్నదిశా
పాళికి కొంగులు ముడిపడుతున్నవి.



# కనుపించని కారుచిచ్చు

కనుపించని కారుచిచ్చు
కణకణమున రాజుకుంది.
కణకణమని రగులుతుంది.
ఇంక కొన్ని గడియల్లో
ఇలాతలంనుంచి యెగిసి
మింటిమేడచూరు కంటుకుంటుంది.

వినిపించని విలయధ్వని
సనసన్నగ గొణుగుతుంది.
తనలోనే కుములుతుంది.
ఎప్పుడో ఒకప్పుడు ఈ
యిరుకు పెదల గదులు వీడి
ఉప్పెనలా గట్లు తెంచుకుంటుంది.

కనురెప్పలపై ఏవో
ఇనుపతెరలు పడుతుంటే
పట్టుదప్పి తూలిపడే
బ్రతుకుతీరు మారుతుంది.
భళ్ళున తెలవారుతుంది.
నల్లమందునిషా విరిగిపోతుంది.

ప్రాణా లుండగనె పంత
రాగల్లా, దేగల్లా
రక్కక తిను దుశ్శక్తుల
ముక్కు మొండివడుతున్నది.
బిక్కవడ్డ కపోతాల
రెక్కల్లో వజ్రశక్తి మెరుస్తుంది.



# ఎవడురా!

[1959 లో భారతదేశపు సరిహద్దులపై చైనా తొలిసారిగా దాడిచేసినప్పుడు]

ఎవడురా నాతల్లి హిమగిరికిరీటమ్ము
పై చేయిసాచ నుంకించె!
ఎవడురా నాపువ్వుటెడదలో నిప్పుర
వ్వలు రాల్చగా సాహసించె!

పంచశీలసుధాస్రవంతిలో హాలాహ
లము క్రుమ్మరించె నెవ్వండు!
యోగివలె కనుమోడ్చియున్న నాజాతిమెడ
పై పాము విసిరె నెవ్వండు!

చెలిమితో చేరవచ్చెడివారి నా మంచు
మల సాధుమూర్తియై పిలుచు.
బలిమితో కాలుదువ్వగ నెంచువారి పా
లిట రుద్రమూర్తియై నిలుచు.

వాక్కుతోనే రొమ్ము ప్రక్కలించెడు ధర్మ
వీరావతార మీజాతి.
కాదంచు ఈ నేల కాలుంతువా ప్రతికు
శాగ్రమగు కైజారురీతి.

పచ్చినెత్తుటితోడ ప్రమిద వెల్గించుటకు
పట్టుబట్టిన వెర్రివాడా!
పదిలపరచితి స్నేహభాండమ్ము నీకొరకు.
అందుకో పాత చెలికాడా!




వెన్నవంటి భరతావని
వెన్నున నిప్పంటించిన
దెవ్వరు, నువ్వేనా
క్రొవ్వెక్కిన చైనా!

ఎదరొమ్మున బాకు రువ్వి
ఏమెరుగనిలా దిక్కులు
చూచు నంగనాచీ!
ఛీఛీ! విషవీచీ!

సామ్యవాద మను పేరిట
సామ్రాజ్యపిపాస దీర్చ
నెంచు కుటిలజాతీ!
ఇదా రాజనీతి?

సరిహద్దుల తగాదాల
బురఖాలో ద్వేషవిషం
బుసకొట్టెను లేరా! నిను
పసికడితిమి పోరా.

ప్రక్కయింటి ద్వారానికి
పచ్చతోరణాలు చూచి
కళ్ళు మండె నీకు; నీ
కథ తెలిసెను మాకు.

తిండికి సరిపోకుంటే
తిరిప మెత్తుకో నుంటివి
జనం పెరిగితే మిత్రుల
శరణు వేడుకో నుంటివి.

తోడిదేశమున చొరబడి
దురంతాల కొడిగట్టె
బూజుబుద్ధి తగదుర, చెం
గిజుఖాను సోదరా!

భరతజాతిసత్వమ్మును
పరీక్షించబోకుము; అది
సహనానికి ఏలిక.
సమరానికి కాళిక.



# గుండెగుండె కొక దీపం

గుండెగుండె కొక దీపకరండము వెలిగింది నేడు.
శిరముశిరము కొక హిమాద్రిశిఖరము పెరిగింది నేడు.
గళముగళము కొక కేసరిగర్జన వినిపించె నేడు.
జాతిరక్తమున సాగరచేతన కనిపించె చూడు.

ఎక్కడనో హిమవంతుని ప్రక్కలోన చిచ్చురేగ
ఇక్కడ కన్యాకుమారి ఎగిసె నపరచండికయై.
ఎవడో ఒక దుర్మతి మన యెల్లలపై కాల్మోపగ
కదనుదొక్కె కోటికోటి పదము లుక్కుపిండములై.

భాషల పేరిట రేగిన ఘోషలన్ని అడుగువట్టె.
పొలిమేరల తగాదాల పొగలు చెదరి దిశలుపట్టె.
ఒక నెత్తురు పంచుకున్న స్వకుటుంబముమాదిరిగా
దేశము తొడగొట్టి శత్రునాశముకై నడుముగట్టె.

గద్దెలు విడనాడి యెదదగద్దెలనే యేలాలని
బుద్ధుల కంటుకొనియున్న బూజుదులిపి వేయాలని
ఒక పరివర్తన తరంగ మొడ్లు చీల్చుకొని వచ్చెను.
శకునుల దుస్తంత్రమ్ములు లుకలుకలై పోజొచ్చెను.

ఎవడు హిందు? వెవడు తురక? ఎవడురా కిరస్తానీ?
ఎవరిది తెలు? గెవరి దరవ? మెవరిది హిందూస్తానీ?
ఒకేతోట వికసించిన రకరకాల పువ్వులురా!
ఒకే వాణిగుడిలో వెలుగొందిన మణిదివ్వెలురా!



# ఒకదండం

అడ్డబట్ట చుట్టుకొని
అరచొక్కా తొడుక్కొని
కాంగ్రెస్సును బతికించిన
కామరాజు కొక దండం.

నట్టనడిమి వెన్నెముకను
పుట్టెనురా రాచపుండు.
దానిని కరగించిన నవ
ధన్వంతరి కొక దండం.

తొక్కిన అడుగే తొక్కుచు
తోకజార్చు గుర్రానికి
కొరడారుచి చూపించిన
కొత్త రౌతు కొక దండం.

మంచినేయి తాగితాగి
మందగించు దేహానికి
విద్యుద్ఘాత మొసంగిన
పెద్దబుర్ర కొక దండం.

బంగరు కంచాల లోని
పక్వాన్నమునే కాదని
ఉపవసించబూనుకొన్న
తపసి కిదే తుది దండం.



# చైతన్యకేతనం

హిగమువట్టి జడీభవించు నాడులలోన
చేతనాగ్నిప్రభాకేతనాగ్రము లెత్తి
సోలిపోయిన శిరస్సులను హైమాద్రి శిఖ
రమ్ములుగ మార్చిన దినమ్ము రానేవచ్చె.

నలమందు దిన్నచందాన పడియున్న దను
కొన్న జగ మొక్క మొగి కుబుసమ్ము విడిచి సడి
పిరికిమందును ద్రాగి బెజిల్లినట్లు క
న్పించు దేశమ్ము పులిపిల్లయై దూకినది.

ఎంత పౌరుషము తండ్రీ! గుండెలు తుపాకి
గుండ్ల కెదురుగ నిల్పుకొన్న నెరజోదులది.
ఏమి సాహసము తండ్రీ! చంటిపాపలను
బాసి కాసెబిగించు పచ్చిబాలెంతలది.

పాలగచ్చుమహళ్ల డోల లెక్కడ? కటికి
కారాగృహమ్ము లెక్కడ? ఏమి చిత్రమిది!
పసిడిచషకముల పాయసము లానెడు భోగి
చెరసాలలో మట్టిచిప్పతో తృప్తిపడె.

ఒక మూరెడంత పేలిక చుట్టుకొని, కట్టె
బట్టుకొని వెర్రిగా బడిపోవువాని గని
కోటిరాజన్యుల కిరీటములు వంగె; ని
ప్పులను గ్రక్కెడు ఫిరంగుల గుండియలు క్రుంగె.

అది యెంత తపము ప్రోగైన దినమోకాని
మాటయే ఒక శాపమంత్రమై ధ్వనియించె.
అది యెంత పౌరుషము పొదిగొన్న కాలమో
గడ్డిపోచయె విచ్చుకత్తియై దీపించె.

తన చేలు పండునని, తన జోలె నిండునని
లెక్కించుకొని మీస మెక్కించు వీరులా?
కారు కా రవ్వారు; ధారాప్రపాతముగ
కురియుటయె తప్ప ఫల మెరుగని ఘనాఘనులు.

ఎదో పిలుపు వినిపించి ఎదపొంగి పసుపుబ
ట్టలతోనె నిప్పుగుండముల దూకినవారు
ఎదో ఊహ పదునెక్కి యిల్లు వాకిలి వీడి
ముండ్లకంచెలను కాల్ద్రొక్కి నడచినవారు

ఎందరెందరి బ్రతుకు లింధనములై పోవ
సత్యాగ్రహానలజ్వాల పుట్టిన దయా!
ఎందరెందరి రక్త మింకు లింక నీ
మట్టిలోన స్వరాజ్యమణి జనించిన దయా!

ఆ మహాత్ములు నాటినట్టి వృక్షమ్ముపై
కోతుల ప్రైగబడెడు ఖ్యాతియే మిగులునా?
వా రిచ్చి పోయిన సుధారసఘటము గుంజు
లాటలో పుసికి పదియా ర్వక్కలగునా?

ఏమి టీ జంజాట? మెందు కీ పితలాట?
మీ స్వార్థరథుంరు యిం కేనాడు శమియించు?
పొరుగింటి చూరు కగ్గి రగిల్చి ఎక్కెమ్ము
లెగురవేయుటకే లభించెనొ స్వరాజ్యమ్ము?

ఇపుడిప్పుడేకదా ఎవరి కందక పారు
కొండవాగులు పాలకుండలై నిల్చినవి!
నినమొన్ననేకదా గునుగుపండని భూము
లందు బంగారు సస్యములు తలలూపినవి!

ఇంతకాల మ్మిరుల యినుపగజ్జెలు మూల్గి
ఇరుకువాడల విద్యుదిందిర పదము మోపె.
తరతరాలుగ దాస్యభరముతో అణగారి
గుడిసెలకా పడియున్న గొడ్డుబ్రతుకులు చేపె.

ఇంక ఐదారుమెట్లే మిగిలె నీదేశ
మాత్మ తేజశ్శిఖర మందుకొనుటకు సుమా!
ఈ క్రుమ్ములాట లిట్లే సాగెనా, గమ్య
మేమొ కానీ ఉన్న మెట్లే విరిగిపోవు.

కోతియుగమా, కాదు; రాతియుగమా, కాదు;
విధుమండలమ్ముతో వియ్యమందెడు యుగము.
జలధులట్టుల యెడందలు కరళ్లెత్తగా
ఈ యడ్డుగోడ లింకెంతకాలము నిల్చు?

కత్తిమొనపైన లోకమ్ము గిరగిర తిరుగు
దుర్దినమ్ముల కెపుడో త్రుప్పువట్టిన దయా!
చెలిమిపండిన మనస్సులె వజ్రధారలై
మెరియగ శిలాత్మకుల శిరము లొరిగినవయా!

బ్రతుకు బ్రతుకెల్ల కష్టమువోలె వెచ్చించి
పోయిన మహాత్మునికి పుట్టినిల్లిది సుమా.
ఈయింటిలోన సన్నాయిరవములె తప్ప
గుడ్లగూబల మూలుగులు వినంబడరాదు.



# వెలుగు మెట్లు

ఇవిగివిగో మెట్లు; పుడమి
గవనునుండి ఆకాశపు
లోగిలిదాకా తీగలు
సాగిన జలతారు మెట్లు.

నేలమీది యిరుకుగదుల
నిల్వలేక నా దేశం
నిలువెత్తుగ కట్టుకొన్న
వెలుతురు కడ్డీల మెట్లు.

కార్చీకటి కటకటాల
కవాటాల పగులదన్ని
అంబరమున జూచిన కా
నంబడు వజ్రాల మెట్లు.

పెనునిద్దుర భూతంవలె
కనురెప్పలపైన తిష్ఠ
వేసికొన్నవారల కీ
వెలుగుమెట్లు కన్పించవు.

గతకాలపు మద్యమ్మును
గతికిన విపరీతమతుల
కీ కడానిమెట్లు కాను
పించును పొగనీడలట్లు.

ఆకాశప్రాకారపు
టంచులదాకా విసురుము
పదునెక్కిన చూపులు; క
న్పడ వెందుకు పసిడిమెట్లు?

దుమ్ముమారినట్టి నమ్మ
కమ్ముల జాడించి దులిపి
నివురెక్కిన గుండెలోని
నిప్పురవ్వలను రగిల్చి;

ఆశలు పులకించగ, ఆ
కాశము తలవంచగ; ఈ
మెట్లపైన కాల్మోపి గ
మించగ రారా తమ్ముడ.

ఇరులు గ్రుడ్లువెట్టెడు నీ
యిరుకుటడుసుగుడిసెపైన
గచ్చుమిద్దె మొలిపించెడు
కాలము వచ్చిన దన్నా!

'ఓమ'గూడ పండనట్టి
ఊషరభూములలోపల
పదార్వన్నెబంగారపు
పైరులు తలలూపునురా.

అంతరిక్షమున దాగిన
అమృతపాత్ర సాధింపగ
కదలుమురా సోపానా
గ్రములపైన పాదమూని.

ఇవిగివిగో మెట్లు; పుడమి
గవనునుండి ఆకాశపు
లోగిలిదాకా తీగలు
సాగిన జలతారుమెట్లు.



# గండపు గడియలు

స్వాతంత్ర్య మ్మనగానే
జబ్బ లుబ్బిపో విప్పుడు.
జెండా లల్లాడగనే
గుండె లుబికిరా విప్పుడు.

శుష్క నినాదమ్ములు మ
స్తిష్కాలను కదలించవు.
సభార్భటులు మూగగుండె
సవ్వడులను వినిపించవు.

గతపౌరుషగాథలు ర
క్తమును తరగలెత్తించవు.
సిద్ధాంతములు బ్రతుకున
చిగురాకుల మొలిపించవు.

పగిలిన అద్దమ్మువంటి
వర్తమానమున స్వజాతి
నిండుమొగము శతసహస్ర
ఖండాలుగ కనిపించెను.

ఇంటా బయటా రహస్య
కంటకాలె ఎదురాయెను.
కమ్మని గుండెలకు కత్తి
కౌగిలింత ఫలమాయెను.

కన్నులలో దాచి పెంచు
కొన్న పావురాశిశువును
గద్ద తన్నుకొనిపోయెడు
గండపు గడియలు వచ్చెను.

పొలిమేరలలో పాముల
పుట్టలు పొడుచుకవచ్చెను.
కబంధహస్తాలు కుత్తు
కలమీదికి దిగజొచ్చెను.

అష్టగ్రహములు కలిసి వి
షాగ్ను లుమిసినను గానీ
శిరసు వంచకుండ జాతి
చిరునవ్వుచు నిల్చుండెను.

ఉగ్గుపాలతో సహనపు
నిగ్గులు జీర్ణించుకొన్న
జాతిగాన, విషజాతుల
ఘాతమ్ముల కెదురొడ్డెను.

మన జాతిని బెదరించెడు
శని విరుగుడు కాకపోదు.
అమృతములో తడిసిన ది
వ్యముహూర్తము రాకపోదు.



# ఆత్మీయం

నే నొక్క అణువునే కాని దైత్యప్రకృతు
లకు మేరుపర్వతశిరశ్శిఖర మైనాను.
నేను ధూళికణమ్మునేకాని రసవదా
త్మలకు స్నేహతరంగితకరండ మైనాను.

నను నేను తెలిసికొంటిని; అంతియే కాదు,
నాచుట్టు ఎన్ని పరిణాహవ్రతాక్షరమ
నీషానిధుల్ గలవో నే తెలిసికొన్నాడ.
నాకు తెలియనిది ద్వేషాకృతి అదొక్కటే.

కొకిబికితలంపులకు, కొక్కెరజపమ్ములకు,
మడతమాటలకు, కసుమాలంపు చేష్టలకు
అలవాటుపడ్డ జీవుల కొందరిని జూచి
ఒక్క పొడినవ్వుతో ఊరకుంటిని నేను.

ఒక అనామకుడు నా వికచకీర్తిప్రౌఢ
కౌముదులలో కళంకము రుద్దగాలేడు.
ముకుళితాంతశ్చక్షు వొకడు నా వర్ధమా
నప్రతిభ కెట్టి బందాలు వేయగలేడు.

నన్ను సన్మానించినారు కొందరు వెర్రి
వారు; వెన్నెల విరియగా రివ్వుమని యెగిసి
పోవునట్టి చకోరములకు తోబుట్టువులు.
వారి వెర్రి రసైకధారాప్రణీతమ్ము.

నను చిరంజీవి యన్నారు కొందరు పెద్ద
వారు; నాకు సనత్కుమారతేజ స్సహ
స్రాంశ మబ్బిన జాలు నంచు నెంచినవారు.
వారి వాగ్గీతి ఆశీరమృతరమ్యమ్ము.



# రసాంజలి

ఏకవీరవిచూపులు ప్రసరించగ దంష్ట్రాకరాళ
మృత్యుముఖము గూడ వేయిరేకుల పద్మ మ్మయ్యెను—

ఏరసాత్ముని మృదూహాలు పారినంత గుండెలేని
శిలాప్రకృతిలోన ఊర్వశీమూర్తులు చిగురొత్తెను—

ఏ ఋషిసమ్మితుని ధ్యానధారల కడ్డునిల్చిన
తమశ్శిలలు సాలగ్రామములై ప్రతిభాసించెను

అతనిగూర్చి తలచుట యన్నది పూర్వసుకృత గంధము
అతనిగూర్చి పలికిన అల్పాక్షరమైన ప్రబంధము.

కొండకోనలలో సుషుప్తి నుండిన తొలి నిర్ఝరిణిని
కడలి బాహువులలోనికి నడిపించినవా డెవ్వడు?

దుమ్మువారినట్టి జీవితమ్ముల అట్టడుగునందు
మరుగువడిన పరమాత్మకు తెరదీసినవా డెవ్వడు?

ఎవ రాతడు? జీవనసంధ్యేతిహాసమున పేరిన
చీకటిలిపి తుడిచి పసిడిరేకలు చిత్రించినాడు!

ఎవ రాతడు? బ్రతుకునిండ ఇగముకొల్పు వేదనలను
జ్వాలలుగా మార్చి మనశ్శాలల వెలిగించినాడు!

అతడు నేల నిల్చియు దివియంచులు ముట్టిన భవ్యుడు.
ఆతడు గంధర్వాంశను అవనికి దించిన నవ్యుడు.

అతడు జోలె సాచినాడు, అమృతభిక్షకోసరమే.
అతడు శిరసు వంచినాడు, అభవుని పదసన్నిధినే.

పాటల రెక్కలపై అంబరవీధుల కెగిరె నతడు,
చితికిన నరజాతి భావిశిఖరమ్ముల చూచుటకే.

ఓ కవితారసాలపుంస్కోకిలమా! వ్యాకులమా
మాజాతికి నీ గీతిక మధుమాసమహోదయమ్ము.

ఓ కళాకలాపనవమయూరవిభూ! నీస్మృతి జిగి
చచ్చిన విశ్వంభర కౌక శాశ్వతనృత్యోత్సవమ్ము.

ఎల్లలు దాటి జనించిన షెల్లీ వందురే కాని
ఆలస్యముగా పుట్టిన అపరకాళిదాసు వీవు.

నీకు దేశకాలమ్ములు నిమిత్తమాత్రములె కాక
మనిషిలోని దివ్యాంశకు మారుపేరు వయ్య నీవు.

నీ వల్లిన స్వప్నమ్ములు నేటికి వాడని పూవులు.
నీవు మీటిన మృదూహాలు నేటికి మ్రోసెడు వీణలు.

నీవు ప్రభుని చరణమ్ముల నివేదించు గీతాంజలి
నిత్యము బీటెత్తిన గుండెల పండించు రసాంజలి.




షరవాణి యను గండుదొరసానిమ్రోల మన
బాస బానిసపిల్ల పగిది ఒదిగిన వేళ

మడ్డిగట్టిన సంఘమర్యాదలకు కట్టు
వడి పెద్దలే బుద్ధి ముడుపుగట్టిన వేళ

చిన్ని నాపొట్టకే శ్రీరామరక్ష యని
ఎవని గోతమ్ము వాడే నింపుకొను వేళ

పూతగౌతమి గడ్డలో తలెత్తిన జో దెవండు?
వేరెవరు? మన కందుకూరి వీరేశవిబుధుండు!

ఓ కందుకూరి వంశోదధి శశాంకమూర్తీ!
విశాలకీర్తీ! నీవన్న
నా చిన్నిగుండె సంద్రమువోలె వికసించు;
కెరటాలుగా పొంగి సరిగమలు వినిపించు.

నా తెలుగుజాతి పుణ్యాలు పండిన రూపమా
మణిదీపమా! నీవన్న
నా పిట్టకలము సింగముభంగి లంఘించు;
సటలెత్తి భావసంపుటములు విజృంభించు.

వెలవెలందులతోడ కులుకుచే గొప్ప యని
అనుకొన్న ఘనుల గుట్టును బయటపెట్టితివి.

ధనముకోసము గడ్డి తినెడు అధికారులను
కలముపోటులతోడ గజ్జుమనిపించితివి.

రాయిరప్పల పూజసేయుటను నిరసించి
మంచి మనసే దైవమందిర మ్మన్నావు.

సత్యవాక్కే మహాస్త్రముగా ప్రయోగించి
కుత్సితమ్ముల నాభిగూళ్లు చీలిచినావు.

నీచేతి చలువతోనే వితంతువులు తమ
తలలపై నీలాలు నిలుపుకొన్నా రయ్యా!

నీ కటాక్షమ్మె తండ్రీ! బెరడుగట్టి పో
యిన అనాధల బ్రతుకు లిగురింపజేసినది.

నీవు కాసెబిగించి నిలిచినందున దురా
చార భూతముల బండారమ్ము తెలిసినది.

సగముచచ్చిన సమాజమ్ము నీ సంస్కార
బలము పుంజుకొని జంగలు సాచి నడచినది.

ఆంధ్రభారతి కూపిరాడనీయని అలం
కారభారమ్ము గని కంట తడివెట్టితివి.

క్రొత్తవెల్తురు లేక కుంచితమ్మగు మాతృ
భాషాలతకు పైడిపందిళ్లు వేసితివి.

పెంకులుగ కన్పడు కవిచరిత్రముల ద్రవ్వి
తులలేని రత్నరాసులను పైకెత్తితివి.

కటుకౌషధమువంటి జటిలశాస్త్రాంశముల
తేనెలూరెడు పచ్చి తెలుగులో పంచితివి.

ముక్కుపై కోపమ్ము ముసురుకొను నీ వెట్లు
రచనలందున హాస్యరసము చిల్కితి వయ్య!

పట్టి అలిపిరి ప్రాణివైన నీ వేరీతి
బండ్లకెత్తెడు గ్రంథపటలి నల్లితి వయ్య!

పశుబలమ్ముఁన కదరి వశముదప్పనివాడ !
డబ్బుఎరజూచి బోల్తాపడని మొనగాడ !

కందుకూరి కులమ్మె కాదు, నాలుగుకోట్ల
తెలుగువంగడము వెల్గులు చిందె నీవల్ల.

అందుకోవయ్య తాతయ్య ! వేనకు వేల
మనుమల శుభాభినందన గుచ్ఛములెల్ల.



# గురజాడ

ఓ కవీ గురజాడ! కవితా
శ్రీకి వెల్గుల మేడ! జాతీ
యతకు విచ్చిన పూలదారీ!
అలత నెరుగని బాటసారీ!

ఎట్టి మాత్రాచ్ఛందముఁ గొని
ఏము రవ్వలు రాల్చినామో
అట్టి ఛందస్సుందరికి నీ
వంచనడకలు నేర్పినాడవు.

బండలా పద్యములు? కావని,
కొండలా కావ్యములు? కావని
గుండెలే శబ్దములుగా కల
కందగీతుల నల్లినాడవు.

కులమతమ్ముల ఉక్కుడెక్కల
నలిగిపోయెడు మాలలంగని
అల్లనాడే కంట నీరిడి
నట్టి వెన్నెలమనసు నీయది.

మరఫిరంగీగుండ్లు బంతుల
మాద్రి ఎగిరెడు కాలమందున
కత్తివైరము కాల్చుమని యెలు
గెత్తు వజ్రగళమ్ము నీయది.

కన్యకాచరితమ్ము, పూర్ణమ్మ
గాథ—రెండే చాలునయ్యా
పరిమళించును 'నిత్యమల్లె'ల
కరణి నీ స్మృతినందనమ్మున.

ఎందుకయ్యా బండ్లకొద్దిగ
ఎద కదల్చని కావ్యరాసులు?
జాతినాడులలోన పారెడు
గీతి యొక్కటి చాలదా మరి!

జిడ్డువట్టిన సూత్రముల న
ర్చించు భక్తులు నీదు కొత్త స
రాల డాలు నెరుంగ ఇంకను
చాల దొక్క శతాబ్దమైనను.

పలుగురా ళ్ళలవాటు వారికి
జిలుగుపలుకు రుచించునా?
'కొయ్యబొమ్మలె మెచ్చు కళ్ళకు
కోమలుల సౌ రెక్కునా'!



# మణిహారం

[పోతన కావ్యం వ్రాసిన 'అభినవపోతన' శ్రీ వానమామలై వరదా చార్యులు. ఆయన సన్మాన సందర్భంలో నేను చేసిన గానం]

గుండెలోన రసవదర్థభాండమ్ములు గలవాడా
గొంతులోన పుంస్కోకిలకూజితములు గలవాడా
నిన్నేమని వినుతింతును అన్నా! వరదన్నా! నీ
మనసు వెన్న, తనువు వెన్న, మాటతీరు వెన్న.

ప్రాణమున్న భావాలకు నీ నుడియే వాణికి గుడి
ఆకుపచ్చడూహలకే నీ కావ్యము ఆరనిమడి
చిక్కని కైతలకు నిన్ను చెప్పుకొందు నో యన్నా
నిన్ను మించు కవి యేడీ? ఉన్నా డొక పోతన్న.

ఎంతటి పుణ్యమ్మును పండించుకొన్న దోరుగల్లు
పోతన్నకై కా, 'దళినవపోతన్న'కు పురుడువోసె.
రత్నగర్భనామము సార్థక మీ తెలగాణమునకు.
పూతభాగవతముతోడ పోతనకావ్యము జనియించె.

ఒక ఊపిరితిత్తిని మిత్తికి కబళముగా నొసంగి
విలవిలలాడెడు శబ్దమ్ముల కూపిరిపోసినావు.
బువ్వకు సరిపోవునన్ని గవ్వలు లేకున్నగాని
మవ్వపు కైతలు రచించి రవ్వలు రాల్చితివి నీవు.

కృతులలోన, బ్రతుకులోన యతిస్థితిని నిల్పుకొన్న
వరదా! నీ కందింతును తరుణగేయకహ్లారం.
మనుషులకే కాదు సుమా అనిమిషులకుసైత మలం
కృతిగా వెలుగొందుత నీ మృదులాక్షరమణిహారం.

# పద్యాభరణం

వడలి వత్తలైన తెలుగు
నుడులకు జీవము పోసిన
గిడుగు రామమూర్తికి ఋణ
పడియున్నది తెనుగుగడ్డ.

పైని పటారమ్ములతో
భాషాభేషజము చూపు
పండితుల నదల్చిన ఉ
ద్దండుడు మన గిడుగుపిడుగు.

నాల్కల మల్కల నలిగెడు
పల్కులనే తొలి పల్కుల
పంక్తియందు నిల్పిన శ
బ్దజగద్బాంధవు డాతడు.

దిక్కు మొక్కు లేని సవర
వాక్కున కొక అక్షరమౌ
గుడిగట్టిన విబుధవరుడు
మడిగట్టని మహీసురుడు.

బ్రతుకంతా తెలుగుదనం
ప్రతినిధిగా వెలుగొందిన
గిడుగుపండితుని స్మరణం
ఎడదకు నవ్యాభరణం.



# రవిస్మృతి

తొలిఉషస్సుల తలిరునవ్వుల
    తొంగిచూచెడి సాధుమాధురి,
వాలుసంజల జాలిచూపుల
    తేలివచ్చెడి వేదనాఝురి,
కౌముదుల కపురంపు వలపులు,
    కారుచీకటి మూగపిలుపులు
ఏకమైన రసైకమంత్రము
    నీకవిత్వ మ్మోరవీంద్రా!

గాలితెరలం దణగిపోయిన
గాఢచుంబనముద్ర లెన్నో
నింగినీలిమలోన దాగిన
నిబిడవీక్షణమాలలెన్నో
విరిసిపోవకముందె వాడిన
విరుల నిశ్వాసమ్ము లెన్నో
పరుగుపరుగున వచ్చి నీ కా
వ్యములలో తలదాచుకొన్నవి.

కొదమచుక్కల కన్పడని అం
గుళుల మృదులస్పర్శలందున
పెరిగి విరిగెడు కడలితరగల
ఉరములోపలి స్పందనమ్ముల
కదలజాలని గిరుల యెడదల
కట్టువడు చైతన్యమందున
అందియందని రసరహస్యము
లందుకొను సర్వజ్ఞమూర్తివి.

పూల మెత్తందన మెరుంగగ
ముండ్లపై నడయాడు మంటివి.
అమృతమాధురులంద హాలా
హలమునే రుచిచూడు మంటివి.

వేకువల అందాలు తెలియగ
చీకటుల పారాడు మంటివి
ప్రళయఝుంఝులె నవ్యసృష్టికి
లలితసంగీతమ్ము లంటివి.

ఏది మృత్యువు? వికటవిషదం
ష్ట్రాదిగంబరమూర్తియా యది?
జగతి కంపిలజేయు భయద
స్వప్నమా మరి? కాదు కా దది.
మృత్యు వన్నది నీకు మాత్రము
నిత్యనవగాంధర్వగీతిక.
ప్రభుని సన్నిధి జేర్చ ముంగిట
వచ్చి నిల్చిన దేవమాతిక.

దేవు డెక్కడ? మూతవడు మం
దిరపు చీకటిగదులలోనా?
పాలసంద్రములోననా? హిమ
పర్వతాగ్రముపైననా మరి?
కాదు; విశ్వస్థితికి తన ర
క్తమ్ము పిండెడు మట్టిలోపలి
మనిషిలోనే దేవు డున్నా
డనుచు శంఖము నొత్తినాడవు.

జన్మభూమినిగూర్చి నీరా
జనము లెత్తుటెకాక తూరుపు
పడమరల కొాక స్నేహసేతువు
నిడిన పరిణతదృష్టి నీయది.
భావకవితాస్వర్ణపీఠము
పైన అచ్చరతో సమమ్ముగ
బిచ్చకత్తెకు చో టొాసంగిన
పిండివెన్నెలమనసు నీయది.

కుటిలశంకాశృంఖలలతో
కటకటంబడుచున్న మానవ
కోటులకు మోక్షము నొాసంగెడు
క్రొత్తబుక్కులు నీదు వాక్కులు.
పటునిరాశాగ్రీష్మధాటికి
పగులువారిన గుండియలతో
తల్లడిల్లెడు యాత్రికుల కమృ
తంపు తేటలు నీదు పాటలు.

పరభృతమ్మై నీగళ మ్మొక
స్వరతరంగము సాచినంతనె
విశ్వభారతి పసిడితీగల
వీణియను శ్రుతిచేసికొన్నది.

పరవశమ్మై నీవు భావాం
　　బరమునఁ న ర్తించినంతనె
జడజగత్తుకు పాతవాసన
　　సడలి, అందెలు ఘల్లుమన్నవి.

నిన్ను గని నా భారతావని
　　పున్నెములు పండించుకొన్నది.
నిన్ను గని విశ్వాంతరాళము
　　వెన్నెలలు నిండించుకొన్నది.
ఆర్షతేజము నీవుగా మా
　　రాకుతొడిగే మహాకవీ!
అందుకొను మీ తెలుగుకవి అభి
　　నందసప్రసవాంజలి.




ఏమున్నది ఇంకేముంది!
ఈవిశ్వం మూలుగుతుంది.
ఉన్న రెండు రెక్కలలోపల
ఒక్క రెక్క తెగిపోయింది.

జవచచ్చిన వర్ణాహంకృతి
చేసెనురా కఠోరహుంకృతి.
కెనడీహత్యారూపంలో
కిచకిచలాడెనురా దుష్కృతి.

శాంతికి తల దువ్వినవాడు
సమతకు వెలుగిచ్చినవాడు
'లింకన్' వారసు డగువాడు
ఇంకా మనలో కనరాడు.

కూటాలను కట్టని చేయి
క్రుశ్చేవును నెట్టని చేయి
మంచికి జై కొట్టిన చేయి
వంచన పాలయ్యెను భాయీ!

నలుగురిలో తలెత్తి తిరిగే
నల్లమనిషి కెవ్వడు దిక్కు?
మళ్ళీ తెలిచారల బెబ్బులి
మానవదేహాలను రక్కు.

తోక జార్చు పాకిస్తా నిక
తొొటగొట్టి సవా లంటుందో
కాటువడ్డ భారతదేశం
ఖడాయించి ఎదిరిస్తుందో.

అవకాశం చిక్కిందేమో
అణ్వాస్త్రపిపాసుల కిపుడు
జగమంతా ఘూర్ణిలునేమో
సమరాశ్వం డెక్కల చప్పుడు.

ఈలోపం సమస్తజగతికి,
ఈ శాపం పచ్చని ప్రగతికి;
ఐనా శ్రీకెనడీ సంస్మృతి
మానవులను నడిపించే ద్యుతి.



# పిడుగుపాటు

[జవహర్‌లాల్ నెహ్రూ నిర్యాణవార్త విన్నవెంటనే వేదనతో రగులుతూ—]

ఇంతకంటె ఘోరవార్త
యేమున్నది యేమున్నది!
పట్టపగలు పెనుచీకటి
పటాలం ముసురుకున్నది.

జవహరు మరణంతో ఈ
జగతి వణకిపోతున్నది.
పచ్చని శాంతిశిరస్సున
చిచ్చుపిడుగు పడుతున్నది.

నారక్తం ఎదురునడక
నడువనిమ్ము నడువనిమ్ము.
రగిలి రగిలి నా గుండియ
పగులనిమ్ము పగులనిమ్ము.

నా నరాల తీగలన్ని
నడిమికి తెగిపోవనిమ్ము.
జవహరుతోపాటు నన్ను
చావనిమ్ము చావనిమ్ము.

గదులెరుగని చెదలెరుగని
యెదను పెంచుకొన్నవాడు
మానవతామందిరమున
మమత నిల్పుకొన్నవాడు

బ్రతుకంతా వెండికొండ
వలె వెల్గిన ధీరు డతడు
మంచి మనసుకే శిరమ్ము
వంచిన సర్దారు డతడు.

జవహరుడే లేని భరత
జాతి జాతి కాదయ్యా!
చమురు లేనినాడు వట్టి
ప్రమిదకు విలు వేదయ్యా!

గాంధీజీ స్వప్నఫలం
గంగలో కలిసె నయ్యా!
విశ్వంభరకంటిపాప
వెలుగే మాసిన దయ్యా!



# చితిమంటలు

[నెహ్రూమృతదేహానికి అగ్నిసంస్కారం జరుగుతుండగా రేడియోలో వినిపించిన ప్రత్యక్షవ్యాఖ్యను విన్నతర్వాత—]

మరువలేము తండ్రీ! నీ
మధురకాంతిరూపమ్మును.
మరువలేము జవహర్! నీ
మహితస్మృతిదీపమ్మును.

గంధపుచెక్కలలో నీ
కనకప్రభలే తోచెను.
చితిమంటలలోపల నీ
చిరునవ్వులె విరబూచెను.

ఆలపించు వైదికమం
త్రాక్షరములలో నీ వి
న్నాళ్ళ మ్రింగుకొన్న వేద
నాస్వరములె వినిపించెను.

కన్ను మూసినావు నీవు,
కన్ను మూయలేము మేము.
చుక్కలలో చోటు నీకు,
రెక్కలు తెగిపోయె మాకు.

మనిషిమనిషిగుండెలోన
తొణకెను కన్నీటి జాలు.
ఇంటింటా గగనవాణి
ఏడ్చె నయా! పగలు రేలు.

అటు జాన్సన్ విలపించెను.
ఇటు క్రుశ్చేవ్ విలపించెను.
విశ్వమంత ఇందిరయై
విలపించెను విలపించెను.

ఎందరు నాయకులు లేరు?
ఎందరు పాలకులు లేరు?
ఐనా నీవలె మనిషిని
అర్చించినవా రెందరు ?

ఆ పడమర ఈ తూరుపు
నీ పలుకుల పందిరిలో
కొంగులు ముడివేసుకొన్న
బంగరుకాలమ్ము మాది.

పశుతత్వం మెడవంచిన
శిశు వెవ్వరు నీవుతప్ప
నీవున్న యుగమ్మున జ
న్మించుటయే మాకు గొప్ప.



# గులాబీ విలాపం

[నెహ్రూ కన్నుమూసినతర్వాత కన్నువిప్పిన ఒక గులాబి పూవు తీగెతో ఇలా అంటుంది]

ఎందుకు కన్నావమ్మా!
ఎందుకు కన్నావు నన్ను?
ఎందుకు పెంచావిన్నా
ళ్లెందుకు పెంచావు నన్ను?

ఒక్కరోజుముందుగ నీ
ఒడిలో జన్మించినచో
కరుణామయుడౌ జవహరు
కరస్పర్శ లందుదాన.

కొన్ని గడియలకు ముందుగ
కన్ను విప్పగల్గినచో
అమృతమూర్తిజవహరుహృద
యమ్ముపైన నిల్చుదాన.

తోటమాలి నిన్న మొన్న
తోటి గులాబులు దూయగ
నా భాగ్య మ్మెపుడు పండు
నా యని ఉవ్విళ్ళూరితి.

ఇపుడు తెలిసె జాతిరత్న
మింక మనకు కనరాదని.
ఇపుడు తెలిసె తోటమాలి
ఈ దెసకే రాబోడని.

ఆ మహనీయుని వక్షము
నం దొక నిముసము నిల్చిన
జన్మ తరించేదే పూ
జాపుష్పమ్మటుల తల్లి!

తుకతుకమను రక్తాశ్రువు
లిక మ్రింగగ లేనమ్మా!
అతని చితిపై ఆహూతి
యౌదును సెలవీయమ్మా!




[నెహ్రూ పరమపదించినతర్వాత మొదటి పదిహేనోఆగస్టు]

జాతికి సంకెళ్లు విరిగి
నీతికి చెరసాల తొలగి
గర్వంగా శిరసెత్తిన
పర్వదినం తిరిగివచ్చె.

కానీ యెప్పటిలాగా
కనులు నేడు మెరియవేమి?
నిరుటివోలె మూర్ధమ్ములు
నిటారుగా నిలువవేమి?

తళతళమను కాంతిసుధా
ధారలోన ఏదో ఒక
నీలినీడ తోచెనేమి?
జాలిగాలి వీచెనేమి?

మన జాతిని విశ్వశిఖర
మున నిల్పిన నెహ్రూజీ
పూచిన చిరునవ్వు లింక
నోచుకోని దివస మ్మిది.

ఏడీ కనరాడు నేడు
ఎఱ్ఱకోటపైన నిల్చి
భారతప్రజాహృదయం
పలికించిన కరుణమూర్తి.

మళ్ళీ వినిపించేనా
మన నెహ్రూఅమృతవాక్కు—
కోటిగుండియలను మేలు
కొల్పినట్టి క్రొత్తబుక్కు—.

అతని వాణి మృదులానిల
రుతిలో వినిపించు నింక.
అతని మూర్తి జీవనదుల
గతిలో కనిపించు నింక.

అత డె త్తిన ఆశయాల
పతాకాల నీడలోన
చైతన్యం చేయిసాచి
జాతిని నడిపించు నింక.

# ఎడారిలో



# గులాబీలు

[మెదడుకు సంబంధించిన వ్యాసంగంలో చిక్కుపడిన హృదయవాది
స్వగతం]

కృష్ణా! నన్నొక గీతం
గిలుకు మంటివా?
మంచుగడ్డలాగా స్తం
భించిన నా కంఠంలో
జ్వాలాసంగీతమ్మును
పలుకు మంటివా?
నీ కేమిటి మహాప్రభూ!
నృత్యగీతమధుమూర్తివి.

నిత్యానందస్ఫూర్తివి.
నీవు తలచుకున్నావో
నిమిషంలో ముంగిట్లో
శారదరాకారాత్రులు
సహస్రశంపాగాత్రులు.
మరి నేనో—నా సంగతి
యెరుగనివాడివా ప్రభూ!
ఉరుశోధనయజ్ఞంలో
నరాలనే సమిధలుగా
మేదస్సును హవిస్సుగా
వేలుస్తున్నాడు గదా!
ఎప్పుడు పోట్లాడే కను
రెప్పల కౌక అమృతబంధ
ము ను గూర్చే నిద్రాసఖి
నయ్యయ్యో గోడకు వ్రే
లాడేస్తున్నానుగదా!
పైబడితే ప్రవరునిలా
జాడిస్తున్నాను గదా!
కాలం నడినెత్తిన కర
వాలంలా జడిపిస్తే,

ఎదుటున్న కవిలెకట్టలు
ఉదధిలాగు బెదరిస్తే
ఎటు తోచక కనిపించని
కటకటాలలోన ఒక్క
మాటు ఒళ్లు విరుచుక ని
ట్టూరుస్తున్నానుగదా!
ఒకటిరెండు తీయతీయని
ఊహలు పసిగంతులతో
తప్పిదారివస్తే, యెద
తలుపు లన్ని గభాలుమని
మూసేస్తున్నానుగదా!
ఇన్నాళ్లుగ న న్నాక
ర్షించు రాగరజ్జువులను
కోసేస్తున్నాను గదా!
ఇలాగున్న నేను గీత
మెలాగు వ్రాసేదయ్యా!
ఎడారిలో గులాబీలు
ఎలాగు పూచేదయ్యా!




ఎటు నీ గమ్యం ఎటు?
పుటుకుమన్న గాలిపటం
పోతున్నటు
ఎటు నీ గమ్యం ఎటు?
నిటలంమీదున్న గీట్ల
కిటుకు తెలుసుకున్నావా
జడలుదిగిన మర్రికింద
నడిచి జడుసుకున్నావా
విధిని వరిస్తున్నావా
వెర్రి నటిస్తున్నావా
ఎటు నీ గమ్యం ఎటు?

ఇంతగా నిరాశలు కబ
ళించి, వేడినిట్టూర్పులు
నెమరువేసి, లోకము కం
డించే దేమిటి?
ఫోనీ సొంతానికైన
పొందిన దేమిటి?
వెలిసిపోవు చీరలాంటి విరక్తి
అందలేని ద్రాక్షలపై అనాసక్తి.

ధ్రువాలను కొలవాలనో
ఎవరె స్టెక్కాలనో
తారల దాటాలనో
కోరలేదు నిన్నెవ్వరు.
నలుగురు కోరే దేమిటి?
నట్టనడిమి చీకట్లో
చిట్టిదివ్వె వెలిగించి
శిఖరంపై గురి వుంచీ
చెకాచెకా నడవాలని
వికలత్వం విడవాలని.
ఇంతకు నీ లక్ష్యం ఎటు?
ఎటు నీ గమ్యం ఎటు?



# మాట్లాడే స్మృతులు

నా స్మృతులు నాల్కల్ని తొడుక్కుని
నడిరేయి ఏమిటో నసుగుతున్నాయి.
గతమనే ముసలిగోవును కట్టేసి
నిర్దయగా అనుభవాల్ని పిదుకుతున్నాయి.

వెన్నెలచమురు ఒంట బట్టించుకొని
పన్నీటి కుల్యల్లో జలకా లాడుకొని
కమ్మకస్తూరి గీర్నామం దిద్దుకొని
కలువపుప్పొళ్లు మెయినిండా అద్దుకొని

తెమ్మెరపల్లకీపై షికారు తిరిగిన దినాలు
గమ్మత్తుగా మత్తుగా కరిగిన క్షణాలు
కనిపిస్తున్నాయి పాత చుట్టాల్లాగా
తునిగిపోయిన కలలోని చిత్రాల్లాగా.

పగిలిపదార్వక్కలైన అద్దంలో
బావురనే బీటవారిన ముఖాలు
రాతిబిళ్ళల్లా వున్న కళ్ళజోళ్ల వెనక
పాతుకుపోయిన కనుపాపల ఖద్యోతాలు
పట్టపగలు జరిగిన సర్పరజ్జుభ్రాంతులు
నిట్టనిలువు పొగచూరిన చంద్రకాంతులు
తేలుతున్నాయి చేపచిక్కని గాలాల్లాగా
కర్మచాలక తోక తెగిన సృగాలాల్లాగా.

భయాల దుప్పట్లు కప్పుకుని ఇరుగ్గదిలో
చావుకు జీవం పోసే మొనగాళ్ళు
ఆశల కుంపట్లు పెట్టుకుని ఆకాశంవేపు
చూపుల్ని ముడుపుగట్టే 'ముని' గాళ్లు
పచ్చిగడ్డి అనుకుని గోతిలో పడ్డ పసిలేళ్ళు
చిచ్చుకౌగిట్లో వెచ్చగా పడుకున్న ఊళ్ళు
అబ్బా! ఎంతటి చేదు జ్ఞాపకా లివ్వి
అరుస్తున్నాయి పొగగొట్టాల్లా వికవిక నవ్వి.

పన్నీట స్నానంచేసిన కోరమీసాలు
కన్నీట అభిషేకమాడిన నయనాంచలాలు
ఈ ద్వంద్వాలు నిన్నటివే—మరి తిరిగిరావా
చేదూ తీపీ కలిసిన ఉగాదు లికముందు లేవా
గానుగెద్దులా అస్తమానం తిరగడమేనా
సానరాయిలా రోజింతా అరగడమేనా
ప్రశ్నావళి వజ్రాయుధం అంచులా మెరిసింది.
పాపం! స్మృతులపై లాఠీల వర్షం కురిసింది.



# కోరికలు

జీవిత సంగ్రామంలో చితికిన బొమికలు
చిగుళ్లు తొడుక్కోవాలి.
మధ్యలో పుటుక్కున తెగిపడ్డ ఆశలకు
మళ్లీ రెక్కలు మొలవాలి.
వరుసదప్పిన తాగుబోతు ఆలాపనల్లో
సరిగమ ఏరుకోవాలి.
పొరపాటున తావుదప్పిన అక్షరాలకు
పునరావాసం కావాలి.

పంజరాలకు అంజలిపట్టే రోజులు
సంకెళ్లకు సలాముచేసే రోజులు
పాతగోరీల్లాంటి రాతియుగాలకు
వైతాళికత్వం జరిపే రివాజులు
క్రీనీడల్లా మాసిపోయిన వని
కెరటంలా విరుచుకపడి చెప్పాలి.
గడచిన 'క్రీస్తుపూర్వం' గదికి
విడిపోని తాళం వేయాలి.
నడుస్తున్న గాంధీశకానికి
పడుతున్న తాళం తీయాలి.
పల్చని అంగిలో దాగివున్న పచ్చివ్రణాలను
పదుగురికి చూపే ముందు
ప్రతిమనిషీ తనలోకి తొంగిచూసుకోవాలి.
పడ్డ పాట్లూ, పొరపడ్డ చోట్లూ
పదిలంగా నెమరు వేసుకోవాలి.
విషాదాల కషాయం తాగి తాగి
ఆనందంలాంటి ఆరోగ్యం పెంచుకోవాలి.
మల్లెలా జీవించే మహాయోగం లేకున్నా
ముల్లులా బతకడం పోవాలి.
పల్లానికి జారే నీరులా ప్రవహించే నెత్తురు పాయ
పక్షాని కోమాపైనా ఎదురుఉరకాలి.

చప్పుడుచేయకుండా చప్పగా మోగే గుండెకాయ
అప్పుడప్పుడు డప్పులా, డమరువులా పలకాలి.
గొంగళీ పురుగులా ప్రాకడం మానేసి
కురంగంలా దూకడం నేర్వాలి.
ద్వేషంలాంటి చీకటిని కాల్చేసి
దివ్వెటీలా చూడడం నేర్వాలి.
'ఎత్తైన నింగి నల్లనిది, లోతైన నీరధి నల్లనిది
ఎదుట వున్న హృదయం తెల్లనిది'
ఈ సత్యం నిత్యం చదువుకోవాలి.
ఎవని నీడను వాడే యెదుర్కోవాలి.
కిటికీరెక్కల సందుల్లో నలిగి
కీచుమంటున్న బుడతగాలి;
దారి కడ్డమైన కొండరాళ్లకు
తల బాదుకుంటున్న తరంగాళి;
చెక్కిటి బురదను కడిగేయలేక
చిక్కిపోతున్న శీతాంశుమాలి
కర్మను నిందించడం మానుకోవాలి.
కర్తవ్యం ముప్పురిగా పేనుకోవాలి.
సన్నని ఆశల పల్లవి పల్లవించాలి.
నున్నని పాటల దళాలు పరిమళించాలి.



# సామాన్యుడు

ఇన్నాళ్ళూ నన్ను గూర్చే పాడుకున్నాను.
నాగుండె దడల్ని నేనే కొలుచుకున్నాను.
ఊహల సెలయేళ్ళ మైకంలో పడి
ఉన్నది చెప్పడం మానుకున్నాను.

ఇప్పుడు నిన్ను గూర్చి పాడుకుంటాను.
చప్పుడుకాని నీ హృదయసంగీతం వింటాను.
ఆకాశాన్ని చుంబించే నీ లక్ష్యాన్ని
లోకానికి చూపి పొంగిపోతుంటాను.

నీవు సా-మాన్యుడివి; ఒకరిద్దరికి మాన్యుడివి,
పాదరసంలాంటి మాటకు పాదులు వేసినధన్యుడివి.
రూకనూ మూకనూ పట్టుక వ్రేలాడకుండా
మతినీ ధృతినీ నమ్ముకున్న అనన్యుడివి.

గగారిన్ కావాలన్న కాంక్ష నీకు లేదు.
కనీసం పెన్సింగయినా కాదలచుకోలేదు.
ఆశయశిఖరా లెక్కి ఆశల గగనాన్నందుకున్నావ్
పట్టింది మట్టిదివ్వైనా పుట్టెడు చీకటిని
చెండుతున్నావ్.

నేటిదాకా లోకంముందు నీవు వెర్రాడివి.
చిత్తూ బొత్తూ యెరగని ఉత్త కుర్రాడివి.
నీగుండె లోని నాగేటిచాళ్ళను చూస్తుంది
నిన్ను లోకం రేపే కళ్ళ కద్దుకుంటుంది.

అంతటితో నీ ప్రయాణాన్ని ఆపబోకు.
కుంపటిని రొమ్ముమీదినుంచి దింపుకోకు.
చింతనా చేతనా రగులుతున్నంత సేపు
జీవితానికి వేకువేతప్ప లేదు మునిమాపు.



# కావిరంగుపొగలు

నిశ్శబ్దతలా ముడుచుక పడుకున్న ఆకుగుడిసెలోంచి
చీకుగుడిసెలోంచి
నిశాగర్భాన్ని కళపెళలాడించు కావిరంగుపొగలు
ఆవులించు సెగలు.

బాష్పవాయువుల్ని తప్పించుకోలేని నిరుపేదసత్యం
ధరలేని ముత్యం.
శ్రుతి కుదరని వాద్యమేళంలా కీచురాళ్ళ గోల
బూచినాట్యహేల.

గుడిసెకప్పులోంచి తొంగిచూచి నల్లబడ్డ శశి
ప్రతుళ్లిపడ్డ నిశి.
బల్లిపాతర కంటుకొని గిలగిలలాడే వెన్నెలపోగులు
కన్నీళ్ల తీగలు.

పిడకల కుంపట్లలాగా జడుస్తూ మండే బతుకులు
'సండే' మెతుకులు
తడిసిన కట్టెల్లా ఏడుస్తూ రగిలే పేదవాని భావి
చేదలేని బావి.

మృత్యువుతో కుస్తీపడుతున్న ఒంటితిత్తిమనుషులు
సత్తుదినుసులు.
స్వేదానికీ రుధిరానికీ భేద మెరుగని కృషిపండితులు
మషిమండితులు.



# రేఖా చిత్రాలు

విత్తనంలో ఒత్తిగిలివున్న మొక్కలాగా
గుండెలో రెక్కవిప్పని కొదమకోరిక.
అలిసిపోని కంటిరెప్పల అంచులమీద
నిలువలేక జారిపడుతున్న నిద్రాబాలిక.

హేమంతశర్వరి ఉషస్సు కిచ్చిన కాన్క
పచ్చని గరికమెళ్ళో పచ్చి ముత్యాల సరం
మూలకుంపట్లో పడివున్న ముసలినిప్పు
మూలుగుతుంది; నూటారుడిగ్రీల జ్వరం.

మకిలిమనస్సును తొలిచివేసే గంగానది
కాటుకకళ్లను కడిగివేసే యమునానది
కన్నీరు ధరించిన భిన్నరూపా లివి.
మనిషిని వరించిన మధురశాపా లివి.

కాలంచెక్కిలిమీద కావిరంగు పుట్టుమచ్చ
తెలవారుతున్న మృత్యువును తెలిపే వేగుచుక్క
జీవితసంధిపత్రంమీద ఆవులిస్తున్న రేఖలు
చరమసంధ్యాపర్వంలో జమ్మికింది రాతలు.

౧౫

# హంస పయనించింది

చుక్కల్ని చూడలేను.
చుట్టూ రెపరెప కొట్టుకుంటున్న
పసిరెక్కల్ని చూడలేను.
ఎదమీద కుండపోతగా కురుస్తున్న
మృదువైన కన్నీళ్లు చూడలేను.
కన్నీళ్ల సెలయేళ్ల దూకుడులో పుడుతున్న
కనిపించని విద్యుత్ కశాఘాతాల్ని
చూడలేను.

ఇన్నాళ్ళలాగా వెచ్చగా పాడుకోలేను.
మంచుగడ్డలాంటి మరణబంధంనుంచి
నన్ను నేను కాపాడుకోలేను.
మమతల్ని పుటుక్కున తెంచుకోలేను.
మంచంనలువైపులా ఆరవేసిన
తడిసిన కనురెప్పలనుంచి తప్పించుకోలేను.
అల్లంతదూరాన ఒక కుక్క మొరుగుతున్నది.
అంబరాన ఒక రిక్క ఒరుగుతున్నది.
ఇంటివెలుపల గాడుపు ఊళ పెడుతున్నది.
మింటిలోపల ఏడుపు చీలిపోతున్నది.
నిశ్శబ్దత బరువుగా పేరుకుంటున్నది.
నిశ్వాసం అశ్వంలా దౌడుతీస్తున్నది.
చావుబ్రతుకుల సన్నని పొలిమేర
నీవా నేనా అని కుమ్ముకుంటున్నది.
గాలిలో సరికొత్త ఊపిరి రగిలింది.
నేలలో సరికొత్త మృత్తిక మిగిలింది.
వెలుతురు ఒక అంగుళం వికసించింది.
జలహృదయం జలజలా కంపించింది.
ఆకాశం నీరవంగా ధ్వనించింది.
ఆత్మహంస ఊర్ధ్వంగా పయనించింది.

# మలుపు

గుజిలీప్రతిలాంటి గుండెను కాపాడుకుంటూ
మజిలీ చేయాలనే కోర్కెల మధు వూరించుకుంటూ
పాటిదిబ్బమీద నడుస్తూ పచ్చల తివాసి అనుకుంటూ
కాలిబాట చెబుతున్న పూలగాథల్ని వినుకుంటూ
మలుపు తిరుగుతున్నాడు మానవుడు.

ఒలికిపోయిన గతం గూర్చి ఊర్పులు విడిచేవాళ్లను
కరిగిపోతున్న వర్తమానానికి గాభరాపడే వాళ్లను
భవితవ్యపు వెల్తుర్ని చూసి గవాక్షాలు మూసే వాళ్లను
దులపరిస్తూ పోతున్నాడు మానవుడు
మలుపు తిరుగుతున్నాడు మానవుడు.

స్వప్నంలో సగం తాగిన సహారాసౌందర్యాల్ని
శైశవంలో బుగ్గల్ని తాకిన చంచలదృశ్యాల్ని
మిగలకుండా తాగేస్తూ, సొగసుగా నెమరువేస్తూ
మత్తుగా నడుస్తున్నాడు మానవుడు
మలుపు తిరుగుతున్నాడు మానవుడు.

మోడునుదుట చిగిరిస్తున్న ముత్యాల రేఖల్ని చూస్తూ
మరుభూములు లిఖిస్తున్న మరకతరేఖల్ని చూస్తూ
పొగపొగా చుట్టుకున్న నగశిరస్సుల్ని చూస్తూ
పాథేయం సరిచూసుకుంటూ, పాథోధి దాటేసుకుంటూ
మారుతంలా పయనిస్తున్నాడు మానవుడు
మలుపు తిరుగుతున్నాడు మానవుడు.



# చింతవసంతం

చిగుళ్ళు, పురిట్లో సంధికొట్టిన
శిశువుల్లా ఊడిపడుతున్నాయి.
పండుటాకులేమో గబ్బిలాల్లాగా
పట్టుక వ్రేలాడుతున్నాయి.

రోడ్డుపక్కన ముసలి మామిళ్ళమీద
రోకటిపాటలు వినిపిస్తున్నై కాకులు.
శ్రుతికుదరని వాద్యసమ్మేళనంలా
రొద చేస్తున్నై తుమ్మెదమూకలు.

స్ఫోటకంమచ్చలు బయటపడుతున్నాయని
సుధాంశుడు దిగాలుపడుతున్నాడు.
గంధకంవాసనల్ని భరించలేక
గంధవహుడు గగ్గోలుపడుతున్నాడు.

పడతుల విగ్గుసిగలమడతల్లోంచి
ప్లాస్టిక్ మొగ్గలు పలకరిస్తున్నాయి.
విలాసినుల నీలికళ్ళజోళ్ళలోంచి
చిలిపిచూపులు ఫిల్టరవుతున్నాయి.

సహనమనే లేబిలు అంటించుకుని
జావగారిపోతుంది ఆవేశం.
తెల్లని నల్లని మబ్బులు తొడుక్కొని
ఒళ్లు దాచుకుంటుంది ఆకాశం.

పంచాంగం చెబుతున్నది—వసంతం
ప్రకృతిలో మందహాసం చేసిందని.
ప్రబంధకవు లంటున్నారు—మరుడు
పంచబాణాలు పదును పెడుతున్నాడని.



# జగత్తు మత్తుగా పడుకుంది

జగత్తు మత్తుగా పడుకుంది.
తమస్సు తపస్సులో వుంది.
సగం పీల్చి పారేసిన సిగరెట్టు
జ్వాలనమే తన ధ్యేయ మంటుంది.

'పంఖా' రెక్కలు వాల్చుకుంది.
పరదా గాలి పీల్చుకుంటుంది.
గోడమీది గడియారంమాత్రం
గుండెదడల్ని కొలుస్తూవుంది.

వడివేసి వొదిలేసిన ముంగురులు
పసిపాముల్లా బుసకొడుతున్నై.

కారుమోతా కుక్కకూతా కలిసి
సుగమసంగీతాన్ని సృష్టిస్తున్నై.

కళ్లజోడు వెనకాల రెప్పల్ని
కప్పుకొని చూస్తున్నై నేత్రాలు;
ఉప్పంటే చాలు నగ్నంగా
ఉబికివచ్చే విస్ఫులింగాలు.

ఊహాలు వ్యూహాలు పన్నుతున్నై.
మనస్సు ధనుస్సులా మ్రోగింది.
ఆత్మాభిమన్యుని గర్జాధ్వని
అవ్యక్త గుహాలో రేగింది.

ఎన్ని కాంగోలు ఎన్ని క్యూబాలు
ఎన్నెన్ని సరికొత్త కొరియాలు
వజ్రగిరుల్లాంటి నమ్మకాలమీద
భయాల్ని వర్షించే అల్జీరియాలు.

పెరిగిపోయే ధరలు, అరిగిపోయే బియ్యంమరలు
ఫీజుల సమస్యాపూర్తికి ఫౌజుల పరంపరలు
వరదుల్నే ధిక్కరించి వరుసదప్పిన వరదలు
బ్రతుకనే చిక్కడపల్లిలో ప్రతినిత్యం బురదలు.

పరా: కాలం—పన్నెండుగంటలు పలికినరేయి
నాలో అర్ధచైతన్యం పడగెత్తిన స్థాయి.




[గోపీచంద్ స్మృత్యంకం]

'కన్నీళ్లు నాహృదయాన్ని కడిగి శుభ్రం చేస్తాయి,
నవ్వులు నన్ను సహచరులకు సన్నిహితుణ్ని చేస్తాయి'
అన్నాడు ఖలీల్ జిబ్రాన్ కవి ఆనాడు.
అన్నా! నీవు వాటిని సార్థకం చేశావు నేడు.

కృతుల్ని కన్నీటిలో అద్ది తీశావు.
బ్రతుక్ని నవ్వుల రవ్వల హారం వేశావు.
ఊహకంటే ఉత్తాలంగా, భావనకంటే విశాలంగా
ఉండడ మెలాగో 'అక్షరాలా' రుజువుచేశావు.

నక్షత్రాల కళ్లు మిలమిలా మెరుస్తున్నప్పుడు
నందివర్ధనం పూలు గలగలా నవ్వుతున్నప్పుడు
నాకు స్ఫురిస్తుంది నీ మూర్తి.

నడిమితరగతి సమాజం నడక తెగిపోయినప్పుడు
జడివచ్చిన జీవితాలు ముడుచుకపోయినప్పుడు
నాలో ధ్వనిస్తుంది నీ ఆర్తి.

మాట్లాడే మౌనివిగా మాతో కొన్నాళ్లు తిరిగావు.
మళ్లీ బోధివృక్షంకిందికే చల్లగా వెళ్లిపోయావు.



# అజ్ఞాతవాసం

అరణ్యవాసం అయిపోయింది.
అడవిలో వున్నప్పుడే నేను అయిదుగా చీలివున్నాను.
అజ్ఞాతవాసం ఆరంభమైంది.
ఆ అయిదురూపాలకు కొత్త తొడుగు లంటుకున్నాయి.
చూపుకు మాత్రమే అయిదు రూపాలు వేరు;
వాటి నాళాల్లో పారే రక్తంతీరు
వాటి కడుపుల్లో కదలే మజ్జిగనీరూ ఒకటే.
వాటి అంతరంగాల్ని కలిపికుట్టే దారం ఒకటే.

ఆధారం ఒకటే.
అదే ఆశయం.
చిచ్చులాంటి ఆశయ మది.
చిచ్చు కడుపును చీల్చుకొనివచ్చి
వియచ్చరుల్ని విభ్రాంతుల్ని చేసిన ఆశయం.
పరమాత్మను పలికించిన ఆశయం.
పదిమాట లెందుకు—అది అచ్చంగా నిప్పు.
ప్రస్తుతం నివురుకప్పిన నిప్పు.
ఆశయం సైరంధ్రిగా మారింది.
మాసినతలతో నిలిచింది.
మసిపాతలో మాణిక్యంలా కనిపించింది.
మసిపాతలో మాణిక్యంలాంటి ఆశయం
కీచకప్రవృత్తి కంటికి
పసరాకుల్లో పంచవన్నెల చిలకలా భాసించింది.
కీచకప్రవృత్తికి నోరుతోపాటు
మనసూరింది—తను వూరింది.
మరుని రథం బయలుదేరింది.
కళ్లకు బైర్లు కమ్మాయి.
కామానికి చరమస్థాయి.
కీచకప్రవృత్తి సందిట్లో ఆశయం

గిజగిజ తన్నుకుంది.
సలసల మరిగే చమురుకురిసినట్లు
విలవిలలాడిపోయింది.
అయిదురూపాలూ ఆప్రాంతాన్నే వున్నాయి.
అంతా గమనిస్తూనేవున్నాయి.
మురికిచెరలో తోయబడ్డ గదరుపీరుల్లా
చురచుర చూస్తూవున్నాయి.
చురకత్తుల్నినములుతూచంద్రనిప్పుల్ని మింగుతూవున్నాయి
వాటిల్లో ధర్మమూర్తి మొదట తమాయించింది.
తోటిరూపాలను చూపుల్తో మందలించింది.
అప్పుడు ధర్మమే అడ్డురాకపోతే
అకాలప్రళయం తప్పేది కాదు.
అజ్ఞాతవాసం ముగిసేది కాదు.
ఆశయ మెలాగో గండం తప్పించుకుంది.
అయిదురూపాల్లో ఒకటి దాని జుత్తు నిమిరింది
అనుకున్న ప్రకారంగా అర్ధరాత్రి కావచ్చింది.
ఆశయం వేసుకునే మేలిముసుగు కప్పుకుని
ముచ్చటగా ముడుచుకపడుకుంది ధర్మాంశం.
కీచకప్రవృత్తి దాన్ని స్పర్శించింది.
రేచులా ధర్మం విజృంభించింది.

రెంటికీ జరిగిన సడిలేని సమరంలో
కీచుమంది కీచకప్రవృత్తి.
ఆశయానికి పీడా విరగడైంది.
ఆనందం అంచులు దాటి పొర్లింది.
అయిదురూపాలకు ఒక్క మాటుగా
అమృతస్నానం చేసినట్లయింది.
ఆశయాన్ని బట్టేకదా రూపానికి మనుగడ.
తైలాన్ని బట్టేకదా దీపానికి నిలకడ.



# అక్షరాల గవాక్షాలు

అక్షరాల గవాక్షాలనుంచి అవలోకిస్తున్నాను గగనాన్ని
సగంచచ్చిన ఊహాజీవులకు చమత్కారభిక్షపెట్టేవాణ్ని.
అవిగో ఆకాశంపందిరికి వ్రేలాడుతున్న ద్రాక్షపళ్ళు.
అహో! ఆషాఢయోష ఆరవిడిచిన అలకల చివళ్ళు.
షెల్లీమాటల్లో అంటే సూర్యునికీ సముద్రానికీ పుట్టిన బిడ్డలు.
మళ్ళీ కొత్తగా అనుమంటే గగనాబ్ధిలో తేలే నల్లని మంచు గడ్డలు.

వాటిల్లో కోరచేపల్లా దూసుకుపోయేవేమిటో చెప్పనా?
వాటి కూకటుల్ కొలిచి కూర్చిన ఉత్ప్రేక్ష లేమిటో
విప్పనా ?
కొట్టిన పిండిగా చెబితే మదకలమదిరాక్షుల మెయివిరు
పులు.
కొంచెం చేదుగా చిత్రిస్తే బానిసల వీపుల్ని చిట్లించే
కొరడాచరుపులు.
అక్కడక్కడా గుడ్లు మిటకరిస్తూ కూర్చున్న నెచ్చెలులూ
వస్తున్నా ! మీకోసమేకదూ వేస్తున్నా నిచ్చెనలు.
పంచశీలసూత్రాలను అక్షరాలా పాటిస్తున్నవాళ్ళు మీరు.
ప్రసంగాలు దిగుమతిచేయరు; సరికదా పరస్పరం డీకోరు.
నూనెనుబట్టి వత్తిని పేనుకున్న పరమసాధువులు మీరు.
ఒకేరాత్రి నిండుగా బ్రతికి మర్నాడు కళల్నికోలుపోరు.
అటు ఆఫీసర్లూ కారు, ఇటు కారు చప్రాసీలు.
అనిశం మిణుకుమిణుకుమనే అఖిలజగత్ 'ఏకజీవో'లు.

వేమన పంచాయతీ గ్రంథాలయం,
తేలప్రోలు :: కృష్ణా జిల్లా.

---



మనసు ఫౌండేషన్

పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPL_A102B/59 |
| పుస్తకం పేరు | [illegible] |
| తారీఖు | 25-10-24 |
| ముందు అట్ట | Yes |
| వెనుక అట్ట | Yes |
| మొత్తం పేజీలు | 143 |
| పెద్ద సైజు పేజీలు | No |
| ఖాళీ పేజీలు | ci, Bci |
| లేని పేజీలు | No |
| తయారు చేసినది | Triveni |
| పేజీలు విడదీసినది | Triveni |
| స్కాన్ చేసినది | Haseema |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | No |
| పరిస్థితి | good |